దేవాలయ ప్రాంగణంలో శ్రీ శ్రీ శ్రీ సనారీ విజ్ఞానం & మహిమలు గ్రంధావిష్కరణ చేస్తున్న విజయవాడ విశ్వబ్రాహ్మణ సంఘాధ్యక్షులు బ్ర॥ జవ్వాది కూర్మాచార్యులు, ఆంధ్రప్రదేశ్ స్వర్ణకార సంఘాధ్యక్షులు, యమ్.యస్. ప్రకాష్ గార్లతో ఉపన్యసిస్తున్న మహాదాత బ్ర॥ బంగారు మధుగణేష్

హైదరాబాద్‌లోని ప్రముఖ సాహితిరత్న యన్.వి. రఘువీరప్రతాప్ దంపతులు సనారీ పీఠాధిపతులకు పాదపూజ చేయు సందర్భములో రాష్ట్ర సచివాలయ వర్కర్స్ సంఘాధ్యక్షులు బ్ర॥ పద్మాచారి టి.ఆర్.యస్. జనరల్ సెక్రటరీ కందారం రాజమోహన్ గార్లతో

ఆంధ్రరాష్ట్ర విశ్వబ్రాహ్మణ ధర్మపీఠం వారు 10-1-2015వ తేదిన పీఠాధిపతులను ఆదర్శదంపతులుగా సన్మానించినపుడు ఆదిశంకరాచార్య గురుకుల వ్యవస్థాపకులు పడగండ్ల వెంకటాచారి గారు , మా కుటుంబసభ్యులు

ఓం షన్మతోద్ధారకాయ నమః
ఓం సర్వకామఫలప్రదాయ నమః
ఓం సర్వపీఠాగ్రవాసియే నమః
ఓం సర్వరోగనివారణాయ నమః 100
ఓం సర్వలోకజగద్గురవే నమః
ఓం సామగానప్రియాలోలాయ నమః
ఓం సుబిల్వార్చనసంతుష్టాయ నమః
ఓం సృష్టిస్థితిలయకారణాయ నమః
ఓం షన్మతోద్ధారకాయ నమః 105
ఓం హనుమధ్వజాయ నమః
ఓం హ్రీంకారవర్తనాధ్యక్షాయ నమః
ఓం క్షామంతకాయ నమః 108

శ్రీశ్రీశ్రీ సనారీ విశ్వనాధ దేవాలయము
ఓం హ్రాం శ్రం ఐం క్లీం సౌః సౌః క్లీం ఐం శ్రీం హ్రీం ఓం
sri Balaji Arts Cell: 8142216027

ఓం,హ్రీం,శ్రీం, ఐం, క్లీం, సౌః, భం, భం, మహా దేవ గురు బ్రహ్మార్పణమస్తు

**శ్లో॥** వామేపార్వతి మారుతాత్మజపురోభాగస్తపార్శ్వద్వయో।
ప్రేమోద్భూతమహాఋషిమునిగణాః గాన్యాగ్రవేదాగమాః
చిన్ముద్రాంకితశూలఫాలమభయాస్వర్ణోపవీతోజ్వాలా
మాలాకుండలనూపురాంగభశితౌపాహీసనారీపతే॥

**(కుంకుమ పూజ చేస్తే)**

**శ్లో॥** శ్రీమహాదేవిదేవతా భద్రేసర్వమంగళం మంగళే।
లసత్కుం కుమచూర్ణేనపూజయామి ప్రసీదమే॥

ఓం శ్రీ అన్నపూర్ణాసమేత విశ్వేశ్వరస్వామినే నమః కుంకుమ పూజాం సమర్పయామి.

**(పసుపు పూజ చేస్తే)**

**శ్లో॥** ఓం గౌరీ మిమాయ సలిలాని తక్షత్యేకపదీ ద్విపదీసా చతుష్పదీ।
అష్టాపదీ నవపదీ బభూవషీ సహస్రాక్షరాపరమేవ్యోమన్॥

ఓం శ్రీ అన్నపూర్ణాసమేత విశ్వేశ్వరస్వామినే నమః పసుపు పూజాం సమర్పయామి.

**(పుష్పాలతో చేస్తే)**

**శ్లో॥** ఆయనేతే పరాయణే దూర్వారోహన్తు పుష్పిణిః।
హ్రదాశ్చపుండరీకాణి సముద్రస్యగృహాఇమే॥

ఓం శ్రీ అన్నపూర్ణాసమేత విశ్వేశ్వరస్వామినే నమః పుష్ప పూజాం సమర్పయామి.

**అక్షతలతో చేస్తే**

ఓం అర్చత ప్రార్చత ప్రియమేధాసో అర్చత। అర్చంతుపుత్రకా ఉతపురన్న ధృష్ణుర్చతః.

ఓం శ్రీ అన్నపూర్ణా సమేత విశ్వేశ్వరస్వామినే నమః అక్షతాం పూజాం సమర్పయామి.

**ధూపం:** ✤ ఓం యత్పురుషం వ్యదధుః కతిధావ్య కల్పయన్ ముఖంకి మస్యకౌ బాహూ కావూరూపాదావుచ్యేతే॥ ఓం కర్దమేన ప్రజాభూతా



మయిసంభవ కర్దమ శ్రియమ్ వాసయమే కులే మాతరమ్ పద్మ మాలినీమ్॥ ✤ ఓం గుగ్గిలం ఘృతసంయుక్తం కున్కుమంమహిసాక్షికం ఆఘ్రేయో స్సర్వదేవానాం ధూపోయాంప్రతిగృహ్యతాం॥

ఓం శ్రీఅన్నపూర్ణసమేత విశ్వేశ్వరస్వామినేనమః ధూపమాఘ్రాపయామి

**దీపం:** ✤ ఓం బ్రాహ్మణో"ఉశ్యముఖమాసీత్ బాహూ రాజన్యఃకృతః ఊరూత దస్యయ ద్వైశ్యః పద్భ్యాగ్ంశూద్రో అజాయతః॥ ✤ ఓమ్ ఆపః స్రజంతు స్నిగ్ధాని చిక్లీత వసమే గృహే నిచ దేవీమ్ మాతరమ్ శ్రియమ్ వాసయమే కులే॥ ✤ ఓం ఉద్దీ"ప్యస్వజాత వేదోపఘ్నం నిర్యుతిం। మమ పశూగుం శ్యామాహ్యా మావహ జీవనంచ దిశోదిశః॥

ఓం శ్రీ అన్నపూర్ణసమేత విశ్వేశ్వరస్వామినేనమః సాక్షాత్ దీపం దర్శయామి

**నైవేద్యం:** ✤ చంద్రమామనసోజాతః చక్షోస్సూర్యో అజాయతముఖా దింద్రశ్చాగ్నిశ్చ ప్రాణాద్వాయురజాయత॥ ఓమ్ ఆర్ద్రామ్ పుష్కరిణీమ్ పుష్టిమ్ పిజ్గలామ్ పద్మమాలినీమ్ చంద్రామ్ హిరణ్యయీామ్ లక్ష్మీమ్ జాతవేదో మమావహా॥ ✤ **నివేదనామంత్రం** ఓం భూర్భువస్సువః ఓం తత్సవితుర్వరేణ్యం భర్గో దేవస్యధీమహీ ధియోయోనః ప్రచోదయాత్ పరోరజసేసావధోం. సత్యంత్వర్తేన (రాత్రికి ఋతం త్వాసత్యేన) పరిషించామి, అమృతమస్తు అమృతోపస్తరణమసి అమృతమస్తునే అమృతమస్తు (మహానైవేద్యానికి నీళ్ళు చుట్టూ జల్లి తమలపాకుతో నీటిని నివేదనాపదార్ధమలపైజల్లుతూ)

ఓం శ్రీ అన్నపూర్ణసమేత విశ్వేశ్వరస్వామినేనమః భక్ష్యచోష్య, లేహ్యాపానీయ మహానైవేధ్యం సమర్పయామి ఓం ప్రాణాయస్వాహా", ఓం అపానాయస్వాహా" ఓం వ్యానాయస్వాహా" ఓం ఉదానాయస్వాహా", ఓం సమానాయస్వాహా" మధ్యే మధ్యే పానీయం సమర్పయామి (ఈలాగు ఐదుసార్లు చెప్పి అయిదుసార్లు నివేదనగావింపవలయును) ఉత్తరాపోశనం సమర్పయామి హస్తప్రక్షాళయామి పాదౌప్రక్షాళయామి శుద్ధాచమనీయం సమర్పయామి (3సార్లుగా ఒక్కక్కబొట్టుగా నీళ్ళుస్వామివార్కి చూపుతూ క్రిందకు వదలాలి)

**తాంబూలం:** ✤ ఓం నాభ్యాఆసీదంతరిక్షం శీర్ణోద్యౌఃస్తమవర్తత పధ్భ్యాం భూమిర్దిశఃశ్రోత్రా"త్ తథాలోకాగ్ం అకల్పయన్॥ ✤ ఓమ్ ఆర్ద్రామ్ యః కరిణీమ్ యష్టిమ్ సువర్ణామ్ హేమ మాలినీమ్ సూర్యామ్ హిరణ్మయీమ్ లక్ష్మీమ్ జాతవేదో మమ ఆవాహ॥ ✤ శ్లో॥ పూగీ పలైస్సకర్పూరై ర్నాగవల్లీ దళైర్యుతం ముక్తాచూర్ణ సమాయుక్తంతాంబూలం ప్రతిగృహ్యతామ్॥

ఓం శ్రీ అన్నపూర్ణసమేత విశ్వేశ్వరస్వామినేనమః తాంబూలం సమర్పయామి (తాంబూలం లేకుంటే అక్షతలు ఉంచాలి)

**శంఖం:** శ్లో॥ **ఓం మహామేరుగిరి స్సర్వే వేదనామాలయేయధా।**
**తధా బ్రహ్మాదిదేవానాంమమగేహే స్థిరోభవేత్.॥**

ఓం శ్రీ అన్నపూర్ణ సమేత విశ్వేశ్వర స్వామినేనమః శంఖనాదం సమర్పయామి (శంఖాన్ని ఊదాలి) ఢమరుకంవాయించాలి.

**నీరాజనం :** ✤ ఓం వేదాఽహమేతం పురుషంమహాన్తం ఆదిత్యవర్ణం తమసస్తుపారే సర్వాణి రూపాణి విచిత్యధీరః నామానికృత్వాఽభివదన్ యదాస్తే" ✤ శ్లో॥ హరిః ఓం ఆర్ద్రం జ్వలతీ జ్యోతీరహమస్మీ జ్యోతిజ్వలతీ బ్రహ్మాహమస్మియోహమస్మి బ్రహ్మాహమస్మి అహమస్మి బ్రహ్మాహమస్మి అహమేవా హం మాంజుహోమిస్వః ॥

ఓం శ్రీ అన్నపూర్ణసమేతవిశ్వేశ్వర స్వామినేనమః ఆనంద కర్పూరనీరాజనం సమర్పయామి (గంట వాయిస్తూ కర్పూరం వెలిగించి స్వామికి చూపాలి)

**మంత్రపుష్పము :** (నిలబడి పుష్పాక్షంతలు చేతిలో పట్టుకుని)

ఓం ధాతా పురస్తాద్యముదా జహారశక్రః ప్రవిద్వాన్ ప్రదిశశ్చత స్రః త్వమేవం విద్వానమృత ఇహభవతి న్యాన్యః పంథా అయనాయ విద్యతే ఓం సహస్ర శీర్షం దేవం విశ్వాక్షం విశ్వశంభువం। విశ్వం విశ్వాత్మకం దేవమక్షరం పరమంపదం । విశ్వతః పరమాన్నిత్యం విశ్వం విశ్వాత్మకం హరిం । విశ్వమేవేదం పురషస్త ద్విశ్వము పజీవతీ। పతిం విశ్వస్యాత్మేశ్వరగ్ం శాశ్వతగ్ం శివమచ్యుతం। విశ్వకర్మమహాజ్ఞేయం విశ్వాత్మానాం పరాయణం। విశ్వకర్మ పరోజ్యోతి రాత్మావైవిశ్వకర్మణః। విశ్వకర్మ పరంబ్రహ్మ తత్వంవై విశ్వకర్మణ। ✤



విశ్వకర్మపరోద్యాతా ధ్యానంవై విశ్వకర్మణః। యచ్చకించి జగత్సర్వంద్రుశ్యతే" శ్రూయతేఽపివా। అంతర్బహిశ్చతత్సర్వం వ్యాప్యతే విశ్వకర్మణః। అనంత మవ్యయంకవిగ్ం సముద్రేంతం, విశ్వ శంభువం । పద్మకోశప్రతీకాశగ్ం హృదయంచా ప్యధోముఖం । అధోనిష్ట్యా నితస్యాన్తే నాభ్యాముపరితిష్ఠతి । జ్వాలామాలాకులం భాతీ విశ్వస్యాయతనంమహత్। సంతతగ్ం శిలాభిస్తులం భత్యాకోశసన్నిభం। తసా"్యంతే సుషిరగ్ం సూక్ష్మం తస్మిన్" త్సర్వం ప్రతిష్ఠితం । తస్యమధ్యే మహానగ్నిర్విశార్చి ర్విశ్వతోముఖః। సోగ్రభుగ్విభజన్తిష్ఠ న్నాహారమ జరః కవిః । తిర్యగూర్ధ్వమధ శ్యాయీరశ్మయ స్తస్యసంతతా । సంతాపయతి స్వందేహమా పాదతల మస్తకం। తస్యమధ్యేవహ్ని శిఖా అణియో"ర్ధ్వా వ్యవస్థితః । నీలతోయదమధ్య స్థాద్విద్యుల్లేఖేనభాస్వరా । నీవారశూకవత్త న్వీపీతా భా"స్వత్యణూపమా ।తసా"్యశ్శిఖాయా మధ్యే పరమా"త్మా వ్యవస్థితః। సబ్రహ్మ, సశివ, సహరిస్సేంద్ర,స్సోక్షరః పరమస్వరాట్ । రాజాధి రాజాయ ప్రసహ్యాసాహినే"। నమోవయం వై"శ్రవణాయకుర్మహే। సమే కామాన్ కామ కామాయ మహ్యం"। కామేశ్వరో వై"శ్రవణోతధాతు। కుభేరాయవై"శ్రవణాయ మహారాజయనమః। ఓం"తత్బ్రహ్మ। ఓం"తద్వాయుః । ఓం"తదాత్మ। ఓం"తత్ సత్యం। ఓం"తత్ సర్వం। ఓం"తత్ పురోర్నమః

అన్తశ్చరతి భూతేషు గుహాయాం విశ్వమూర్తిషు। త్వం యజ్ఞస్త్వం వషట్కారస్త్వమింద్రస్త్వం రుద్రస్త్వం విష్ణుస్త్వం బ్రహ్మత్వం ప్రజాపతిః। త్వం తదాప ఆపోజ్యోతిరసోమృతం। బ్రహ్మభూర్భువస్సువరోం ఈశాన స్సర్వ విద్యా నాంమీశ్వర సర్వభూతానాం। బ్రహ్మాధిపతి బ్రహ్మణోధిపతి బ్రహ్మ శివోమేఅస్తు సదా శివోమ్। (పీఠం పై పుష్పాక్షతలు వేసి నమస్కరించాలి)

ఓం విశ్వకర్మాచ విద్మహే। పంచవక్త్రాయ ధీమహి। తన్నో విశ్వబ్రహ్మః ప్రచోదయాత్॥

ఓం భూర్భువస్సువః ఓం తత్సవితుర్వ"రేణ్యం। భర్గో దేవస్య ధీమహి। ధియోయోనః। తన్నో గాయత్రీ ప్రచోద "యాత్।

ఓం పంచవక్త్రాయ విద్మహే। బ్రహ్మగ్రజాయ ధీమహి। తన్నో మనుః ప్రచోద "యాత్॥

ఓం పంచవ్రక్త్రాయ విద్మహే। లోక కర్త్రేచ ధీమహి। తన్నో మయః ప్రచోద "యాత్॥
ఓం పఞ్చ వక్త్రాయ విద్మహే। మహాపూజ్యాయ ధీమహి। తన్నో త్వష్టః ప్రచోద "యాత్॥
ఓం పఞ్చ వక్త్రాయ విద్మహే। సృష్టి కర్త్రేచ ధీమహి। తన్నో శిల్పిః ప్రచోద "యాత్॥
ఓం పంచవక్త్రాయ విద్మహే। లోకజ్ఞానాయ ధీమహి। తన్నో విశ్వజ్ఞః ప్రచోద "యాత్॥
ఓం వీరనారాయణాయ విద్మహే। విరాట్పురుషాయ ధీమహి। తన్నో వీరబ్రహ్మః ప్రచోద "యాత్॥

ఓం మహాదేవ్యైచ విద్మహే। వీరబ్రహ్మ పత్న్యైచ ధీమహి। తన్నో గోవిందాంబా ప్రచోద "యాత్॥

ఓం మహాభక్తాయ విద్మహే। వీరబ్రహ్మ శిష్యాయదీమహి తన్నో సిద్ధ ప్రచోద "యాత్॥
ఓం మహాశక్త్యైచ విద్మహే। వీరబ్రహ్మ పౌత్రీచ ధీమహి। తన్నో ఈశ్వరీ ప్రచోద "యాత్।
ఓం విశ్వేశ్వరాయ విద్మహే। బ్రహ్మ జ్ఞానదాతాయ ధీమహి। తన్నో సనారీః ప్రచోద "యాత్॥
ఓం మహాదేవ్యైచ విద్మహే। సనారీ పత్న్యైచ ధీమహి। తన్నో అన్నపూర్ణాః ప్రచోదయాత్॥
ఓం వాగీశ్వర్యైచ విద్మహే కామేశ్వర్యైచ ధీమహి। తన్నో కామాక్షీ ప్రచోదయాత్॥
ఓం సాదుతత్వాయవిద్మహే ఈశ్వరాంశాయధీమహి తన్నోసాయి ప్రచోద "యాత్॥
ఓం సాంబశివానందాయ విద్మహే జ్ఞానదాతాయధీమహి తన్నోబోధగురు ప్రచోద "యాత్॥

**ప్రధక్షణమ్ :** శ్లో॥ యానికానిచ పాపాని జన్మాంతరకృతానిచతాని తాని ప్రణశ్యంన్తి ప్రదక్షణ పదే పదే పాపోహం పాపకర్మాణాంపాపాత్మాం పాపసంభవాం త్రాహిమాం కృపయాదేవా శరణాగతవత్సలా అన్యధా శరణం నాస్తిత్వమేవ శరణంమమ తస్మాత్కారుణ్యభావేన రక్ష రక్ష మహేశ్వర రక్ష రక్ష సనారీవిశ్వేశ్వర రక్ష రక్ష జగద్గురుః

(పీఠం చుట్టూ 3సార్లు ప్రదిక్షణము చేసి సాష్టాంగనమస్కారము చేస్తూ) ఉరసా, శిరసా, దృష్ట్యా మనసావచసా తధా పదాభ్యాం కరాభ్యాం కర్ణాభ్యాం ప్రణామ్యం, అష్టాంగముచ్యతే

ఓం శ్రీ అన్నపూర్ణసమేత విశ్వేశ్వరస్వామినేనమః సాష్టాంగ నమస్కారం సమర్పయామి (సాష్టాంగ నమస్కారం చేయాలి)



చత్రం: ఓం శ్రీ అన్నపూర్ణ సమేత విశ్వనాధస్వామినేనమః యధాశక్తి పూజాం కరిష్యామి చత్రం సమర్పయామి చామరం వీజయామి నృత్యం దర్శయామి గీతం శ్రావయామి వాద్యం ఘోషయామి ఆందోళికమారోహయామి గజమారోహయామి అశ్వమారో హయామి సమస్తరాజోపచారాన్ సమర్పయామి సమస్తదేవో పచారాన్ సమర్పయామి సమస్త శక్త్యుపచార భక్త్యుపచారాన్ సమర్పయామి. (అక్షతలు ఒక్కొక్క దానికి చల్లాలి)

**పరిపూర్ణ :** శ్రీ దేవ దేవ మహాదేవ పరాత్పరంవా బోధాసుబోధ పరతత్వ ప్రపంచసర్వే మోదాయ భక్త జనలోకఫలప్రదాయ విశ్వేశ్వరాయ అమితప్రియదేశికాయ ఓం, హ్రీం సనారీ విశ్వేశ్వరాయనమః యధాశక్తి మమజపం, పూజా జగద్గురు బ్రహ్మార్పణమస్తు (అక్షంతలు చేతిలో వేసుకొని నీళ్ళువదలాలి) మంత్రహీనం క్రియాహీనం, భక్తిహీనంతత్సర్వంక్షమ్యతాం సనారీవిశ్వేశ్వర సద్గురువేనమః

## మంగళహారతి

మంగళం మంగళం సద్గురుదేవా మంగళం మంగళం మంగళం మంగళం మహానీయమూర్తికి శృంగారమూర్తికి శుభకరునకు మంగళం మంగళం. నింగీరసాతలము నిండిన వానికి బంగారు హారతి పరమూర్తినీకే, మంగళం మంగళం. సద్గురునీకే మంగళం మంగళం॥

హరి హర బ్రహ్మాది అష్టదిక్పతులకూ అమర దానవ దైత్యానంతునకు ఆదిపుట్టినశక్తి అవని మానవులకు ఆదియయినవిశ్వానాధా గురువరా నీకే మంగళం మంగళం.సద్గురునీకే మంగళం మంగళం॥

యజనా యజనాది యారు కర్మంబుల భజనీయమూర్తి విభాగ్యకరీ కుజన జనఘ్న సంకోచనాశ "ఈశ" భజనీయ మనస్కా భావ సద్గురునీకే మంగళం మంగళం. సద్గురునీకే మంగళం మంగళం॥

నాదరూప సర్వనాయికా సయ్యమా నాదనిలయ వేదబోధాధిపా వేదాంత సారభూ విద్యానీవేకానీ పాదారవింద ప్రపత్తి మంగళమిదే మంగళం మంగళం.సద్గురునీకే మంగళం మంగళం॥

సర్వావర్ణములకు సకలవృత్తులనిచ్చి నిర్వహించితివయ్యా నిఖిలేశ్వరా పర్వతావాసుల పట్టణజనులకు సర్వమిచ్చినావు సర్వజగద్గురువా మంగళం మంగళం.సద్గురునీకే మంగళం మంగళం॥

ఐహికులకు నీవు అవని కోరకలీయ అవుతారించినావు ఆత్మేశ్వరా సయ్యామాదేవా మా సర్వమంతయునిచ్చి సంతోషమునిపుడే సత్కరింతుము గురుశ్రీ మంగళం మంగళం సద్గురునీకే మంగళం మంగళం॥

విష్ణుకూటములందు విరివిగా వెలిసిన వీరశాక్తేయుడవై వెలిసినావు విష్ణు పారలింగ వీరుల గలసినవిశ్వనాధా సర్వవిశ్వా దేశికనీకు మంగళం మంగళం. సద్గురునీకే మంగళం మంగళం॥

అవని భక్తులకెల్ల ఆధారణముచేసి ఆరుమతముల కాధారమగుచు నివసించి మాయింట నిజదాసులనుబ్రోవు నిర్మలమూర్తివి నీరాజనంబిదే మంగళం మంగళం సద్గురు నీకే మంగళం మంగళం॥

## తీర్ధం తీసుకునేది

ఓం ఐం ఆత్మతత్వం ఆణమలశోదనార్థం స్థూలదేహం పరిశోధయామి జుహోమి స్వః

ఓం క్లీం విద్యాతత్వం మాయికమల శోధనార్థం సూక్ష్మదేహం పరిశోధయామి జుహోమి స్వః

ఓం సౌః శివతత్వం కార్మీకామల శోధనార్థం కారణదేహం పరిశోధయామి జుహోమిస్వాః

ఓం ఐం క్లీం సౌః సర్వతత్వం సర్వదేహం పరిశోదయామి జుహోమిస్వాహాః

ఓం అన్నపూర్ణ సమేత విశ్వేశ్వరస్వామి సుప్రీణాతు ప్రసాదం శిరసాగృహ్ణామి పాదోదకం శిరసాగృహ్ణామి (పూజ చేసిన పుష్పాక్షతలు శిరసుమీద వేసుకోవాలి.)

**(ఉధ్వాసన నిత్య ఉపాసకులు చెప్పనక్కర్లేదు.)**

**ఉధ్వాసన:** యజ్ఞేన యజ్ఞ మయ జంత దేవాః తాని ధర్మాణి ప్రధమాన్యాసం తేహనాకం మహిమానస్చచంతే యత్రపూర్వే సాధ్యా స్పంతి దేవాః



ఓం శ్రీఅన్నపూర్ణ సహిత విశ్వేశ్వరస్వామి నేనమః యధాస్ధాన ముధ్వాసయామి (స్వామి వార్ని కదిలించాలి)

పంచాశత్కోటి యోజన విస్తీర్ణ భూమండల పర్యంతం సాగన సనాతనాది పంచవింశత్యుత్తర శతబ్రహ్మఋషి గోత్రేభ్యో బ్రాహ్మణేభ్యః శుభం భవతు (గోత్రనామధేయం చెప్పుకొని) అహంభూ అభివాదయే శ్రీ అన్నపూర్ణ సమేత విశ్వేశ్వర స్వామి షోడచోపచార పూజాం కరిష్యామి. (యిది రెండు చెవులు పట్టుకుని వంగి చెప్పాలి)

## శాంతి మంత్రము

మీనాక్షి చంద్రవక్త్ర స్వరమధురవతీ వాదవేదావిలాసే బిమ్బోష్టీ తుంగనాసా ఘనగజగమనా కాంన్తి స్వర్ణ ప్రభాంగా మాణిక్యరత్నా మకుటా మణిమయ భూషా మేఘలావణ్య కేశా ఆదిత్యామృతాంశనయనా అమలమయహృదే సర్వదాహం నమోస్తు! ఓం శాంతిఃశాంతిఃశ్శాంతిః

ఓం సహనావవతు, సహనౌ భునక్తు, సహవీర్యం కరవావహై॥, "తేజశ్వినావధీత మస్తు మావిద్విషావహై" ఓం శాంతిః శాంతిః శ్శాంతిః

**ఏకహారతి:** ఓం ఉద్దీపస్వజాతవేదోపఘ్నం నిరురుతింమమపశూగ్శ్చ మహ్యా మావహజీవనంచ దిశోదిశః.

**నాగహారతి:** హరిః ఓం ఆర్ద్రంజ్వలతీ... జుహోమిస్వః (34పేజిలో)

**3వత్తుల హారతి:** శ్లో॥ సాజ్యంత్రివర్తిసంయుక్తం వహ్నినాయోజితం శుభం గృహాణమంగళ దీపం త్రైలోక్య తిమిరాపహం భక్త్యాదీపం ప్రయశ్చామి దేవాయ పరమాత్మనే త్రాహిమాంనరకాద్ఘోరా దివ్యర్జోతి నమోస్తుతే.

**పంచహారతి:** ఆత్మన్నాత్మానిత్యా మంత్రయతతస్మైసప్త మగ్ంహూతః ప్రత్యశృణోత్ సస్తహూతో భవత్। సప్తహూతోహా వైనామైషః తంవా ఏతగ్ం సప్తహూతగ్ం సంతం"। సప్తహోతేత్యాచక్షతే పరోక్ష ప్రియాఇవహిదేవాః

**పంచహారతి:** సద్యోజాతాది పంచమంత్రములతో కూడా యివ్వవచ్చును.

**పంచహారతి:** ఓం ఆపస్రుజన్తు స్నిగ్ధానిచి క్లీతవసమేగృహేని చదేవీమాతరం శ్రీయంవాసయమేకులే ఓం, హ్రీం,శ్రీం, ఐం,క్లీం, సౌః, సౌః, క్లీం, ఐం,

శ్రీం, హ్రీం, ఓం, అన్నపూర్ణాసహిత విశ్వనాధ స్వామినే నమః పంచహారతిం దర్శయామి.

**నక్షత్రహారతి :** తారకాభ్యోమహాదీపః సర్వత్ర తిమిరాపః విశ్వవిశ్వాంత రోజ్యోతిర్దీపోయం ప్రతిగృహ్యతాం॥

ఓం అగ్నిర్నః పాతుకృత్తికాః నక్షత్రందేవమింద్రియం. ఇదమాసాం విచక్షణం హవిరాసంజుహోతనయస్యభాంతిరస్యయోయశ్యకేతవః
యస్యేమా విశ్వానుభువనాని సర్వాః।సకృత్తికాభిరభి సంహసానః।
అగ్నిర్నోదేవస్య వితేదదాతు॥

శ్రీ అన్నపూర్ణా సమేత విశ్వనాధస్వామినే నమః నక్షత్ర హారతిం దర్శయామి.

**కం॥ శ్రీ కేదారేశ్వరునిన్ సాకల్యంబైన భక్తి సరియగు వ్రతమున్।**
**చేకొని చేసిన యెడలన్ శ్రీ కైవల్యము శుభమ్ములు చేకురుగాకన్॥**

(రామడుగు వాసుశర్మ ఎం.ఎ., తెలుగు, తిరువూరు)

## కార్తీకమాస కేదారేశ్వరవ్రత విధానం

(కేదారేశ్వర వ్రతమాచరించు వారు వారి పూర్వ సాంప్రదాయ ప్రకారము, ఆ రోజు ఉదయాన్నేమేల్కొని అభ్యంగస్నానాదులాచరించి, వారి పూర్వీకులు చేయు విధానంగా, వంటకాలు నైవేద్యాలు సాయంసమయా నికల్లా సిద్ధము చేసుకొని పట్టు వస్త్రములు ధరించి)

## విభూతిమంత్రం

**శ్లో॥ త్ర్యంబకంయజామహే।సుగంధింపుష్టివర్ధనమ్।**
**ఉర్వారుకమివబంధనాత్।మృత్యోర్ముక్షియమామృతా"త్॥**

లలాటంతుమహాదేవం॥ నాభించైవమహేశ్వరం॥ హృదయే, శంకరజ్ఞేయం। కంఠేచవృషభధ్వజం॥ భుజాగ్రేశూలపాణించ॥ తన్మధ్యేకామాంగనాశనం। కరాగ్రే దేవదేవేశం। శ్రీకంఠవామసద్భుజం। తన్మధ్యేయీశ్వరప్రోక్తం। తదగ్రే పార్వతీప్రియం। కరౌద్వౌశివరుద్రంచ। కర్ణాచైవమహేశ్వరం। బహిః కంఠేప శుపతే। శిరశ్చతోసదాశివం। స్మరయేతానినామానిత్రిపుంద్రధారయేత్ క్రమాత్। (ఆయాశరీరభాగములందు విభూధినిధరించాలి)



**గంధధారణ :** గంధద్వారాన్ధురాధర్షాన్ నిత్యపుష్టాంకరీషిణీమ్। ఈశ్వరీగ్ం సర్వభూతానామ్। తామిహోపహ్వయేశ్రీయమ్। (గంధాన్ని ధరించాలి)

**కుంకుమధారణ :** కుంకుమంశోభనందివ్యం। సర్వదామంగళప్రదం భక్త్యానేతం ప్రయచ్ఛామి। గృహాణత్వంమహేశ్వరీ॥ (కుంకుమ ధరించాలి)

**భూమిశుద్ధి :** భూమిర్ధేనుర్ధరణ లోకధారణి। ఉధృతాసివరాహేణ, విష్ణేన శతబాహూనా॥ (తమలపాకుతో నీటిని ఆ ప్రదేశ మంతాచల్లాలి)

## ప్రధాన కలశ స్థాపనా విధి:

ప్రధాన కలశంలో ఉదకము పోయునపుడు:

మంత్రం॥ **ఓం ఆపోయిష్టామయోభువః ఓంతాన ఊర్జేతధాతనా**
**ఓం మహేరణాయచక్షుసే, ఓంయోవశ్శివతమోరసః**
**ఓం తస్యభాజయతేహనః ఓం ఉశతీరవమాతరః**
**ఓంతస్మాదరంగమామవో, ఓం యస్యక్షయాయజిన్వధః**
**ఓం ఆపోజనయధాచనః (కలశంలో నీళ్ళు పోసేది)**

**ప్రధాన కలశంలో తమలపాకులు ఉంచునపుడు:**

మంత్రం ॥ఓంప్రవృష్టయజ్ఞాయజ్ఞేయజ్ఞేగ్ంహవిరజుషతాః॥
(5 తమలపాకులుగానీ, మామిడి ఆకులు గానీకొసలుపైకివచ్చేటట్లుగా పెట్టాలి)

**ప్రధాన కలశముపై కొబ్బరికాయ ఉంచునపుడు:**

శ్లో॥ ఓం యాః ఫలనీర్యాఃఫలాఉపుష్పాయాశ్చ పుష్పిణీః।
బృహస్పతీ ప్రసూతాస్థానోముంచత్వగ్ంహసః॥

**ప్రధాన కలశముపై వస్త్రము ఉంచునపుడు:**

శ్లో॥ ఓంఇవంవస్త్రాణిపీవసావసాధేయివో రచ్ఛిద్రమంత్రవో హసర్గాః।
అవాతిరతిమమృతాని విశ్వార్తేనమిత్రావరుణాశచేధే॥
(పుష్పమాల వేయునపుడు మంత్రం 20వ పేజీలో)

**<u>ప్రధాన కలశాన్ని పీఠముపై నుంచునపుడు:</u>**

శ్లో॥ ఓంఘటమూలేస్థితోబ్రహ్మ, ఘటార్థేశక్తిదేవతా।
ఘటవామేచఋషయో ఘటార్థేభైరవాదయః॥

శ్లో॥ ఓం ఘటస్థాపనాయవిద్మహే ఓం సాగరాయధీమహి।
ఓం తన్నోఘటప్రచోద యాఉత్ పరోరజసేసావధోం॥

**<u>ప్రధాన కలశాన్ని నమస్కరిస్తూ:</u>**

శ్లో॥ దిక్పాలకైర్వైనతేయమృగేంద్రయుక్తం, ఆధారమండప।
షడోపరిపార్వతీస్థం, కూర్మాదిస్వర్ణమణిభద్రప్రలంభమానం॥
సింహాసనందేవనరైశ్చ వంధ్యం॥ (నమస్కరించేది)

ముందు 18 పేజీలో చెప్పినట్లు ఆచమనం, భూతోచ్చాటన, ప్రాణాయామం చేయాలి.

<u>సంకల్పం :</u> మమ ఉపాత్త సమస్తదురితక్షయ ద్వారా, శ్రీకేదారీశ్వరముద్దిశ్య, శ్రీ అర్ధనారీశ్వర ప్రీత్యర్థం; శ్రీమత్పరశివకర్ణి కాజ్ఞేయ ప్రవర్తమానస్య అద్య పంచముఖ బ్రహ్మ, నిర్మిత ప్రపంచ మధ్యే, శుభేశోభనముహూర్తే, విశ్వ బ్రాహ్మణః ద్వితీయ పరార్ధే. శ్వేతవరాహకల్పే, వైవస్వతమన్వంతరే, కలియుగే ప్రధపాదే, కృతయుగ ప్రవేశ సమయే, జంబూద్వీపే, భరతవర్షే భరతఖండే, కర్మభూమిః మేరోః దక్షిణ దిగ్భాగే, శ్రీశైలస్య ఈశాన్య ప్రదేశే, కృష్ణా, గోదావరి యోర్మధ్య ఆంధ్రదేశే, విజయవాడ పట్టణే, స్వగృహేసమస్త దేవతానిలయ, శ్రీ కేదారేశ్వర సన్నిధౌ, అస్మిన్ వర్తమాన వ్యవహారిక చాంద్రమానేన (సంవత్సరే) దక్షిణాయనేశరదృతుః కార్తీకమాసే, శుక్లపక్షే, పౌర్ణమితిదౌ, యిందువాసరే – నక్షత్రే – శుభయోగే, శుభకరణే, ఏవంగుణ విశేషణ విశిష్టాయాం, శుభాభ్యుదయ శ్రీమాన్ శ్రీమతః గోత్రన్య – నామ దేయస్య, మమధర్మపత్ని సమేతస్య, మమసకుటుంబస్య, క్షేమ, స్థైర, ధైర్య, విజయ, అభయ, ఆయురారోగ్య, ఐశ్వర్యాభివృధ్యర్థం, సత్య, ధర్మ, అర్థ, కామ, మోక్ష, పంచవిధ ఫలపురుషార్థసిద్ధ్యర్థ, సకల దుష్ట గ్రహ, గృహ వాస్తు దోష పరిహారార్థం, నవగ్రహ, ఉపగ్రహదోషనివారణార్థం, సకలమనోరధసిధ్యర్థం,



శ్రీ కేదారీశ్వరదేవతాముద్దిశ్య, శ్రీ అర్ధనారీశ్వర దేవతాప్రీత్యర్థం యావచ్ఛక్తి, ద్యానావాహనాదిషోడశోపచార పూజాంకరిష్యే, ఆదౌనిర్విఘ్నేన పరిసమాప్త్యర్థం శ్రీ మహాగణాధిపతి పూజాం కరిష్యే; తదంగకలశారాధనం కరిష్యేః (ఉంగరపు వేలు పంచపాత్రలో ముంచాలి)

**తీర్థ కలశ ప్రార్థన .**

శ్లో॥ కలశస్య శివః పూర్వే। దక్షిణేతు హరి స్స్మృతః।
వేదాస్తు పశ్చిమే భాగే। చోదీచ్యాం మఘవాస్థితః॥

శ్లో॥ భాస్కరస్తూర్ధ్వ భాగేతు। మధ్యే బ్రహ్మగణ స్స్మృతః।
కుక్షౌతు సాగరాస్సర్వే। నదీనద సమన్వితాః॥

శ్లో॥ ఋగ్వేదోఽథ యజుర్వేద। స్సామవేదో హ్యథర్వణః।
ప్రణవాఖ్యశ్చ తే వేదాః। కలశాంబు సమాశ్రితాః।

మంత్రం : ఆకలశేషుదావతి పవిత్రేపరిషచ్యతే ఉగ్గైర్యజ్ఞేషువర్ధతే
ఆపోవా ఇదగ్ం సర్వం విశ్వాభూతాన్యాపః। ప్రాణావా ఆపః।
పశవాపోన్న మాపో।ఽమృతమాప। స్సంమ్రాడాపో। విరాడాప।
స్వ్వరాడ పశ్ఛందాగ్ ష్యాపో। జ్యోతీగ్‌ష్యాపో।
యజూగ్‌ష్యాపస్సత్య మాప। స్సర్వాదేవతా ఆపోభూర్భువస్సు వరాప ఓమ్॥

**ధేను, మత్య, కూర్మ, ముద్రలు ప్రదర్శించాలి.**

**నదీజలప్రార్థన**

శ్లో॥ గంగేచయమునేచైవ, కృష్ణా, గోదావరి, సరస్వతి, నర్మధే, సింధు, కావేరి, జలేస్మిన్, సన్నిధిం కురు ఆయాంతు శ్రీ కేదారేశ్వర స్వామి పూజార్థం। మమ దురిత క్షయ కారకాః। కలశోదకేన పూజాద్రవ్యాణి సంప్రోక్ష్య। దేవం ఆత్మానంచ సంప్రోక్ష్య॥

(ఈ మంత్రముతో పూజాస్తలంలో పూజాద్రవ్యాలపైన దైవంపై తనపై ఉదకంచల్లాలి)

**ఆదౌనిర్విఘ్నేనపరిసమాప్త్యర్థం శ్రీ మహాగణపతి పూజాంకరిష్యే**

(విఘ్నేశ్వర పూజ చేయాలి) (పేజీ నెం 14) షోడశోపచారములతో చేసుకోవచ్చు

శ్రీ మను, మయ, త్వష్ట, శిల్పి, విశ్వజ్ఞ , పంచబ్రహ్మల, ఆదిశక్తి, పరాశక్తి, యిచ్ఛాశక్తి, క్రియాశక్తి, జ్ఞానశక్తి, పంచశక్తుల సవాహన సపరివారసమేత కేదారేశ్వర మావాహయామిస్తాపయామి పూజయామి.

(అక్షంతలు వేసి నమస్కరించాలి)

**న్యాసః :** అస్యశ్రీశివమహామంత్రస్య విశ్వబ్రహ్మఋషిః దైవీగాయత్రీచందః పరశివోదేవతా। మహేశ్వరీశక్తిః హ్రాంబీజం, హ్రీంశక్తిః హ్రూం కీలకం, మమకేదారీశ్వరదేవతాప్రసాదసిధ్యర్థేజపేవినియోగః।

అంగన్యాసం (1) నం అంగుష్టాభ్యాంనమః (4)వాం అనామికాభ్యాంనమః
(2) మం తర్జనీ భ్యాంనమః (5) యం కనిష్టకాభ్యాంనమః
(3) శీం మధ్యమాభ్యాంనమః (6) ఓం నమశ్శివాయః

**కరతలకరపృష్టాభ్యోనమః।**

**హృదయన్యాసం :**

1) ఓంకారాయ హృదయాయనమః 5)వకారాయనేత్రత్రయాయవౌషట్
2) నకారాయ శిరసేస్వాహా 6) యకారాయ అస్త్రాయఫట్
3) మకారాయశిఖాయైవషట్ 7)ఓం భూర్భువస్సువరోమితిదిగ్బంధః
4) శికారాయ కవచాయహుం (రెండు చేతుల చూపుడువేళ్ళు మెలిక వేయాలి)

**ధ్యానం:**

శ్లో॥ చైతన్యం పరిపూర్ణమేకమమలంజ్యోతిర్మయంవ్యాపకం।
తత్వంచాక్షరీమంత్రం మధ్యమఫలం, సూక్ష్మాతిసూక్ష్మంపరం॥

లింగంబ్రహ్మసనాతనంసుమనసాధ్యాతవరూపం సదా
బాహ్యాభ్యంతర సంస్థితం పరశివం ప్రాణేశ్వరం భావయే

(ముందు 19వ పేజీలోని ప్రాణ ప్రతిష్ట, ఘంటా నాధం, మంత్రాలు చెప్పవలెను)



## పంచపూజ

ఓం సద్యోజాతాయవైనమోనమః లంపృధివీతత్వాత్మనే మనుబ్రహ్మణే ఉమామహేశ్వర కేదారీశ్వర స్వామినేనమః
గంధంపరికల్పయామి (గంధం స్వామివారిపై చల్లాలి)

ఓం సద్యోజాతాయవైనమోనమః హంఆకాశతత్వాత్మనేమనుబ్రహ్మణే ఉమామహేశ్వర కేదారీశ్వరస్వామినేనమః పుష్పం సమర్పయామి

| | |
|---|---|
| **అధాంగపూజః** | (పుష్పాలతో చేయాలి) |
| ఓం మహేశ్వరాయ నమః | పాదౌపూజయామి |
| ఓం ఈశ్వరాయ నమః | జంఘేపూజయామి |
| ఓం కామరూపాయ నమః | జానునీపూజయామి |
| ఓం హరాయ నమః | ఊరూం పూజయామి |
| ఓం త్రిపురాంతకాయ నమః | గుహ్యం పూజయామి |
| ఓం భవాయ నమః | శ్రీకంఠం పూజయామి |
| ఓం గంగాధరాయ నమః | నాభిం పూజయామి |
| ఓం మహాదేవాయ నమః | ఉదరం పూజయామి |
| ఓం పశుపతయే నమః | హృదయం పూజయామి |
| ఓం పినాకినే నమః | హస్తం పూజయామి |
| ఓం శివాయ నమః | భుజం పూజయామి |
| ఓం శితికంఠాయ నమః | కంఠం పూజయామి |
| ఓం విరూపాక్షాయ నమః | ముఖం పూజయామి |
| ఓం శ్రీకంఠాయ నమః | కర్ణౌ పూజయామి |
| ఓం త్రినేత్రాయ నమః | నేత్రాణి పూజయామి |
| ఓం రుద్రాయ నమః | లలాటం పూజయామి |
| ఓం శర్వాయ నమః | శిరం పూజయామి |
| ఓం చంద్రమౌళియే నమః | మౌళిం పూజయామి |
| ఓం శంభవే నమః | నాశికానీ పూజయామి |
| ఓం లయకర్తాయ నమః | వక్షం పూజయామి |

ఓం శ్రీ పరమేశ్వరాయ నమః సర్వాంగణ్యాం గాని పూజయామి.
ఓం సద్యోజాతాయవైనమోనమః యంవాయుతత్వాత్మనే మనుబ్రహ్మణే ఉమామహేశ్వర కేదారస్వామినేనమః ధూపమా ఘ్రాపయామి

(స్వామికిధూపాన్ని వేయాలి)

ఓం సద్యోజాతాయవైనవెూనమః రంవహ్నితత్వాత్మనేమనుబ్రహ్మణే ఉమామహేశ్వరకేదార స్వామినేనమః దీపం దర్శయామి
ఓం సద్యోజాతాయవైనమోనమః। వం అమృతతత్వాత్మనే మనుబ్రహ్మణే ఉమామహేశ్వర కేదారస్వామినే నమః అమృతోపహారనైవేద్యం నివేదయామి (తయారుచేసిన పదార్థములు విస్తరిలో వడ్డించి కదళీ కర్జూరాది సమస్త ఫలములను ఉంచి నారికేళము బలిచేసి ఈ క్రిందిమంత్రముతో 5 సార్లు తమలపాకుతో కొబ్బరి నీరు చల్లుతూ నివేదన చేయవలయును)
**మంత్రం:** ఓం భూర్భువస్సువః। తత్సవితుర్వరేణ్యం, భర్గోదేవస్యధీమహీ, దియోయోనః ప్రచోదయాఉత్। సత్యంత్వర్తేన పరిషించామి. అమృతమస్తు. అమృతోపస్తరణమసి। అమృతమస్తునే అమృతమస్తు 5 సార్లు చెప్పాలి.
**రాత్రికి :** ఋతంత్వాసత్యేన పరిషించామి-

**(తమలపాకుతో నివేదన పదార్థములు చూపుతూ)**

ఓం ప్రాణాయస్వాహా, "ఓం అపానాయస్వాహా", "ఓంవ్యానాయస్వాహా", ఓం ఉదానాయస్వాహా, "ఓం సమానాయస్వాహా", మధ్యేమధ్యేపానీయం సమర్ప యామి, ఉత్తరాపోశనం సమర్పయామి, హస్తాప్రక్షాళయామి, పాదాప్రక్షాళ యామి, శుద్ధాచమనీయం సమర్పయామి (స్వామి వారికి 3 సార్లు తమల పాకుతో నీటిని చూపి క్రింద వదలాలి)
**మంత్రం:** ఓం పూగీఫలైస్సకర్పూరైర్నాగవల్లీదళైర్యుతం ముక్తాచూర్ణ సమాయుక్తం తాంబూలం ప్రతిగృహ్యతాం॥
ఓమ్ సద్యోజాతాయవైనవెూనమః సంసర్వాత్మనే మనుబ్రహ్మణే ఉమామహేశ్వరకేదారీశ్వరస్వామినే నమః సర్వోపచారతాంబూలం



సమర్పయామి (తాంబూలంపెట్టి స్వామికి చూపించాలి)

**కర్పూరం వెలిగించి**

హిరణ్యపాత్రం మధో"ః పూర్ణందదాతి। మధవ్యో"సానీతి। ఏకధా బ్రహ్మణముప హరతి। ఏకధైవయజమాన ఆయుస్తేజోదధాతి, సామ్రాజ్యం భోజ్యం" స్వారాజ్యం వైరాజ్యం పారమే"ష్టిగ్ం, రాజ్యం మహారాజ్యమాధిపత్యం, అయగ్ం సముద్ర పర్యాయాస్యాత్సార్వభౌమా, స్సార్వాయుషా, ధాతాపరార్థా పృథివీ సముద్ర పర్యంతాయా" ఏకరాడితి యశస్కరం బలవంతం ప్రభుత్వం త్వమేవరా"జ్యాధిపతిర్భభూవ సంకీ"ర్ణ నాగాశ్వపతిర్నరాణాం, సుమంగల్యం సతతం దీర్ఘమాయుః॥

శ్రీఉమామహేశ్వరకేదారీశ్వర స్వామినేనమః। కర్పూర నీరాజనం దర్శయామి। నీరాజనానంతరం శుద్ధ ఆ ఆచమనీయం సమర్పయామి। (ఒక్కనీటిచుక్క తమలపాకుతో వదలాలి)

(తోరములను పుష్పాలతో గానీ అక్షంతలతో గానీ పూజించాలి)

**అధసూత్రగ్రంధిపూజ**

| | |
|---|---|
| ఓం శివాయ నమః | ప్రథమగ్రంధింపూజయామి |
| ఓం శాంతాయ నమః | ద్వితీయగ్రందింపూజయామి |
| ఓం మహాదేవాయ నమః | తృతీయగ్రందింపూజయామి |
| ఓం వృషభధ్వజాయ నమః | చతుర్థగ్రంధింపూజయామి |
| ఓం గౌరీశాయ నమః | పంచమిగ్రంధింపూజయామి |
| ఓం రుద్రాయ నమః | షష్ఠమగ్రందింపూజయామి |
| ఓం పశుపతయే నమః | సప్తమగ్రంధింపూజయామి |
| ఓం భీమాయ నమః | అష్టమగ్రంధింపూజయామి |
| ఓం త్ర్యంమ్బకాయ నమః | నవమ గ్రంధింపూజయామి |
| ఓం నీలలోహితాయనమః | దశమగ్రంధింపూజయామి నమః |
| ఓం హరాయ నమః | ఏకాదశిగ్రంధింపూజయామి |
| ఓం స్మరహరాయ నమః | ద్వాదశ గ్రంధింపూజయామి |

ఓం భవాయ నమః త్రయోదశ గ్రంధి పూజయామి
ఓం శంభవే నమః చతుర్దశ గ్రంధి పూజయామి
ఓం శార్వాయ నమః పంచదశ గ్రంధిం పూజయామి
ఓం సదాశివాయ నమః షోడశగ్రంధిం పూజయామి
ఓం ఈశ్వరాయ నమః సప్తదశ గ్రంధిం పూజయామి
ఓం ఉగ్రాయ నమః అష్టాదశగ్రంధి పూజయామి
ఓం శ్రీకంఠాయ నమః ఏకోనదశగ్రంధి పూజయామి
ఓం నీలకంఠాయ నమః వింశతిగ్రంధిం పూజయామి
ఓం కేదారేశ్వరాయ నమః ఏకవింశతి గ్రంధిం పూజయామి

సనారీ పూజావిధానము 27వ పేజీలోని 125 నామములు గానీ, శివనామాలు గానీ ఇక్కడ చెప్పుకోవాలి.

(పూజ అయినపిదవ వ్రతకథా ప్రారంభసమయాన తోరము తీసుకునేటప్పుడు)

శ్లో॥ కేదారదేవదేవేశభగవన్నంబికాపతే ఏకవింశ
ద్దినేతస్మిన్ సూత్రం గృహ్ణామ్యహంప్రభో॥

**కట్టుకునేటప్పుడు: (ధారణ సమయంలో)**

ఆయుశ్చ విధ్యాంచతథా సుఖంచసౌభాగ్యమ్।
సమృద్ధికురదేవదేవ సంసార ఘోరాంబునిధౌనిమగ్నం॥
మాంరక్షకేదారదేవనమోస్తుతే (చేతికి తోరము కట్టుకుని)

## కేదారేశ్వర వ్రతం ప్రారంభం

శ్రీమదఖణ్డ భారత భూమండల మణ్డనాయంబై క్షేత్రరాజంబులకది. నాయ కంబైన నైమిశంబను బేరెన్నికగన్న పుణ్యభూమిని, లోకహితార్థంబు పంచార్షేయ మహర్షి ప్రవరులులోక కళ్యాణార్థం దీర్ఘ కాలికంబగు సత్రయాగంబు గావింప సంకల్పించి, తామందులకు దీక్షితులైరి. ఆ సమయంబున వారి సంకల్పసిద్ధిచే, సమస్త శాస్త్ర పురాణకోవిదుడు బ్రహ్మ పుత్రుడు,త్రిశిరస్కుడగు విశ్వరూపాచార్యులుడచట యదృచ్ఛాగతుడయై, ఆమహాత్మునిగని పెన్నిధిని గన్న పేద చందంబున, వారానందంబున



నోలలాడుచు, యర్ఘపాద్యాదులొసగి, భక్తి శ్రద్ధలతో యధావిధిగా పూజించి, ఓ! మహాపురుషా మీరు వేదబ్రహ్మలు, మీ మహిమ వర్ణనాతీతము, మిమ్ము ఏమని వర్ణించగలము? మమ్మనుగ్రహింపదలచి దర్శన భాగ్యముకల్గించితిరి, మాసంశయములు దీర్చనీవే మాకు వేదనిధివి, మాయందు కరుణతోవిశేష ఫల ప్రాప్తిగలిగి, మానవులు సుఖించి తరించుటకు, ఏదేని వ్రత విధానము నెరిగింపుమని ప్రార్థింపగా వారి భక్తి శ్రద్ధలకు ఆనందించి, భవిష్యత్తులో సకల జనులు ఆ చరించదగు, మహామహిమాన్వితమగు అర్ధనారీశ్వర కేదారేశ్వర వ్రత విధానము నెరింగింతును, సావధాన చిత్తులైవినుడని, ఆ బ్రహ్మర్షి వర్ణింపసాగెను. అనంతమహిమాన్వితుడైన పరమశివుని మహిమ మానవమాత్రులెవరు యెంతని వర్ణింపగలరు? శివయను పవిత్రా క్షరద్వయమును, త్రికరణశుధ్యా ఉచ్ఛరించునట్టివారు, అభీష్టాను సారము యిహలోక సౌఖ్యములు పొంది, అంత్యమున స్వర్గమోక్షములను, అవలీలగా పొందుదురనుటలో ఎట్టి సంశయమునూ లేదు.

శ్లో॥ నభూమినజలంచైవ నతేజోనచ వాయువః
నచబ్రహ్మనచర్విష్ణు నచరుద్రశ్చతారకాః
సర్వశూన్య నిరాలంబోస్వయం భూవిశ్వకర్మణః

పంచభూతములు బ్రహ్మాదిత్రిమూర్తులు, దేవేంద్రాది సకలదేవతలు, సూర్యచంద్రతారకాది మహాపదార్థములు, మరి ఏ యితరములులేక, సర్వశూన్యంబైన కల్పాదియందు, అఖండతేజోమయంబైన వట్టిబయలందు అకార – ఉకార, మకార సంయుతంబైన ప్రణవంబు బుట్టి ఆ ప్రణవము నుండి దశవిధనాదంబులు జనించె, ఆనాదములకలయికచే యొక మహాజ్యోతిర్మయా కారంబుప్రకాశించె. ఆయాకృతియే శ్రీమద్విరాట్ విశ్వకర్మ భగవాన్ అయిదుముఖములతో వెలసి, వరసగా సద్యోజాత, వామదేవ, అఘోర, తత్పురుష, ఈశాన్యము, అనుపేర్లుగలవై, అందు సద్యోజాతము నుండి ఋగ్వేదము, మనుబ్రహ్మయు వామదేవము నుండి యజుర్వేదము, మయ బ్రహ్మయు. అఘోర ముఖము నుండి సామవేదము, త్వష్టబ్రహ్మయు.

తత్పురుషము నుండి అధర్వణవేదము శిల్పిబ్రహ్మయు. ఈశాన ముఖము నుండి ప్రణవవేదము, విశ్వజ్ఞబ్రహ్మయు ఉదయించిరి. ఈ పంచబ్రహ్మలు ఆదిశక్తి, పరాశక్తి, ఇచ్ఛాశక్తి, క్రియాశక్తి, జ్ఞానశక్తి అను పంచశక్తులతో కలసి, ఈవిశ్వ నిర్మాణమునకు మూలమగు, సృష్టి, స్థితి, లయము, తిరోధానము, అనుగ్రహములనెడు పంచకృత్యములు నెరవేర్చబడుచున్నవి.

1. సృష్టికృత్యముచే దేవరాక్షస మనుష్య, పశు, పక్షి, మృగ, క్రిమికీటకాది సమస్త ప్రాణులను సృజింపుచూ, దేవమానవ సురాసురుల నిత్యకృత్యములకు వలయు, సమస్త యంత్ర ఆయుధ, ప్రయాణ సాధనములు నిర్మించుటకు, పృధ్వీతత్వమగుయినుమును, సృష్టించి, ఋగ్వేదపారాయణ చేయు సృష్టికృత్యమునకు మను బ్రహ్మయగు ఈశ్వరుడధిపతి.

2. స్థితి కృత్యముచే సమస్త ప్రాణికోట్లకూ జీవనాధారము కల్పించి, కామాది సుఖభోగములచే ప్రాణులను రక్షించుచూ, గృహరససస్యాదులు సమస్త వస్తు సామాగ్రి కల్పించి, జలాంశమగు దారువునిసృష్టించి, యజుర్వేద పారాయణము చేయుస్థితి కృత్యమునకు మయబ్రహ్మయగు నారాయణుడు అధిపతి.

3. లయకృత్యము అనగా సృష్టి, స్థితి కార్యములను విపరీతముగా ఎదుగనీయక, ప్రమాణ నిర్ణయము చేసి, సంహరించుటకు తామ్రసృష్టియు తేజోరూపముసామవేద పారాయణము చేయు, లయ కృత్యమునకు త్వష్టబ్రహ్మయగు బ్రహ్మదేవుడధిపతి.

4. తిరోధానకృత్యము అనగా మరపు మఱుగుపర్చుట, సమస్త ప్రాణులకు సత్యగుణమున అరికట్టుట, అరవదినాలుగుకళలు శిల్పవిద్యకళా సృష్టి అధర్వణ వేద పారాయణము వాయువాంశ తిరోధానకృత్యమునకు శిల్పి బ్రహ్మయగు దేవేంద్రుడధిపతి.

5. అనుగ్రహకృత్యము, వివాహములకు మాంగల్యప్రదానము చేయుట, కాలచక్ర జ్యోతీషాదులు నిర్మించి, మాంగల్యములతో పవిత్రులను జేసి సమస్త కుటుంబముల వారికి, ధర్మ, అర్థ, కామ, మోక్షములనెడి పురుషార్థములను



గ్రహించుట, సువర్ణ సృష్టి ఆకాశతత్వం ప్రణవ వేదపారాయణము జేయు అనుగ్రహకృత్యమునకు, విశ్వజ్ఞ బ్రహ్మయగు సూర్యుడధిపతి.

ఈ పంచబ్రహ్మల పంచకృత్యములతో ప్రపంచ నిర్మాణము సాగిపోవు చున్నది. ఈ అయిదు సృష్టులకు మించి లోకములేదని ఇవే పంచకర్తవ్య అవతార స్వరూపంబులని యజుర్వేదమునందు చెప్పబడినది. ఎట్లనగా

**శ్లో॥ మనుబ్రహ్మణే ఉమామహేశ్వరాభ్యాం నమః**
**మయబ్రహ్మణే లక్ష్మీనారాయణాభ్యాం నమః**
**త్వష్టబ్రహ్మణే వాణీ హిరణ్య గర్భాభ్యాం నమః**
**శిల్పి బ్రహ్మణే శచీపురందరాభ్యాం నమః**
**విశ్వజ్ఞ బ్రహ్మణే సంజ్ఞాభాస్కరాభ్యాం నమః**

అనివేదవచన పద్ధతిని మనుబ్రహ్మాదిగాగల విశ్వబ్రహ్మలు పంచ భూతములుగా ప్రవర్తించుచున్నారు. ఎట్లనగా

- 'త్రికోణహోమగుండం' మను బ్రహ్మయొక్క అంశభూమి (శివుడు) **"తిథి"**, వెండి జందెము శివుని ఆధిపత్యములు
- 'చతుష్కోణహోమగుండం' మయ బ్రహ్మ యొక్క అంశ జలము **(విష్ణువు) "వారం"** పద్మ జందెము. విష్ణువు ఆధిపత్యములు
- 'వర్తులహోమగుండం' త్వష్ట బ్రహ్మ యొక్క అంశ అగ్ని (బ్రహ్మ) **"నక్షత్రం"** తామ్ర జందెము. బ్రహ్మ ఆధిపత్యములు
- 'షట్కోణహోమగుండం' శిల్పి బ్రహ్మ యొక్క అంశ వాయువు(దేవేంద్రుడు) **"యోగం"** నూలుజందెము. దేవేంద్రుని ఆధిపత్యములు
- 'అష్టకోణహోమగుండం' విశ్వజ్ఞ బ్రహ్మయొక్క అంశ ఆకాశము (సూర్యుడు) **"కరణము"** స్వర్ణజందెము. సూర్యుని ఆధిపత్యములు

ఈ విధముగా పంచభూతములు వలన 84 లక్షల రకముల జీవులకు పంచబ్రహ్మలు ఆధారమైనారు. అది యెట్లనగా

భూతత్వంచే మను బ్రహ్మయగు ఈశ్వరుడే శరీరమగుచున్నది.

జలతత్వంచే మయ బ్రహ్మయగు నారాయణుడే రక్తమగుచున్నది.

అగ్నితత్వంచే త్వష్ట బ్రహ్మయగు బ్రహ్మదేవుడే జఠరాగ్నియగుచున్నది.

వాయు తత్వంచే శిల్పి బ్రహ్మయగు దేవేంద్రుడే శ్వాసలగుచున్నవి.

విశ్వజ్ఞబ్రహ్మయగు సూర్యుడే ఆకలి దప్పులకు అధికారులగుచున్నారు.

యిట్టి శరీర నిర్మాణమునకు పంచశక్తుల ప్రభావముచే సమస్త ప్రాణకోటియూ మనగల్గుచున్నవి.

**ఈశ్వరుడు** పాలాశదండము అభిషేకప్రియుడు (ఋగ్వేదము)

**నారాయణుడు** పిప్పలదండము అలంకారప్రియుడు (యజుర్వేదము)

**బ్రహ్మదేవుడు** ఔదుంబరదండం ఆరాధనప్రియుడు (సామవేదము)

**ఇంద్రుడు** వటవృక్షదండము భోగప్రియుడు (అధర్వణవేదము)

**సూర్యుడు** బాదిరి దండం నమస్కారప్రియుడు (ప్రణవవేదము)

కావున ఎవరి యిష్టానుసారము, వారు ఏ ఏ దేవతలను పూజించినా, ఆస్తలమందు ముందుగా నీళ్ళు జల్లుటచే ఈశ్వరుడున్నూ, అన్ని ద్రవ్యములతో అలంకరించుటచే, విష్ణువున్నూ, ధీపారాధనచే, బ్రహ్మయున్నూ, ప్రసాదంబు భోగంబు చెల్లించుటచే దేవేంద్రున్నూ, నమస్కారముచేయుటచే సూర్యుడున్నూ, తృప్తినొందుచూ తద్ రూపంబులలో గల పంచభూతముల ద్వారా అనుభవించుచున్నారు గాన పంచ బ్రహ్మలలో ప్రధముడును, శక్తికి సగభాగమిచ్చిన శివంమంగళకర స్వరూపుడగు పూర్ణబలము కలిగిన అర్ధనారీశ్వరుడునగు, పరమేశ్వరుడు శక్తికి సగభాగాన్నిచ్చిన ఆదిదంపతుల ఆరాధనయే, యిపుడు మీకు చెప్పబోవు కేదారదేవుని వ్రతకథావిధానము. ఈ మహా వ్రతము జాతి, కుల, మత బేధం లేకుండా 21 మార్లు ఎవరు చేయుచుందురో, వారు యిహమందు సర్వసౌఖ్యములననుభవించి, అంత్యమున పరమాత్మలో హారతి వలే ఐక్యమగుదురు. సందేహమువలదు. భక్తి, శ్రద్ధలతో ఆలకింపుడు.

(కొబ్బరి కాయ కొట్టి) శ్రీ కేదారేశ్వర ప్రీత్యర్థం నమస్తే నమస్తే నమోనమః

(31వ పేజీలోని నివేదన మంత్రాన్ని చెప్పుకోవాలి.)



ప్రధమాధ్యాయం సంపూర్ణం

## ద్వితీయాధ్యాయం ప్రారంభము

పరమ పవిత్రమయిన కైలాస పర్వత శిఖరాన పరమేశ్వరుడొకనాడు, పార్వతీ సమేతంబుగా ప్రమధగణాలు, మునిగణాలు, కుబేర, వరుణ, యింద్రాది దిక్పాలకులు, తుంబుర నాదర, అగస్త్యాది, మహాత్ములు సేవిస్తూ యుండగా కొలువు తీరియున్నాడు. ఆ సభలో సదా శివుని ప్రేరణ వల్ల, తుంబురనారదాది ఋషులుగానంచేశారు.వారు మహాశ్రావ్యంగా ఆలపిస్తుంటే దానికి తగు విధంగా రంభాదులు నాట్యం చేశారు. ఆ సమయంలో భృంగిరిటి అనే మహాభక్తుడు, శివుని అనుగ్రహంతో సభాసదులందరికి నవ్వు పుట్టించే విధంగా వికట నాట్యం చేసాడు. దాన్ని చూస్తున్న సభాసదులందరూ నవ్వగా, పర్వతగుహలు మారుమ్రోగాయి. పరమశివుడు సంతోషంతో భృంగిరిటి, నీ నాట్యం నాకెంతో ఆనందం కలిగించింది, అంటూ అతని పై ఎంతో దయ చూపించాడు, భృంగిరిటీ దానికి కృతజ్ఞతగా పార్వతీ దేవిని విడిచి, పరమేశ్వరునికి మాత్రం ప్రదక్షణ, నమస్కారాలు చేసాడు. అలా చేయడానికి కారణమేమని పార్వతీదేవి భర్తని అడిగింది. అపుడు సదాశివుడు మందహాసం చేస్తూ దేవీ! యిహమందు భోగభాగ్యములు అష్టైశ్వర్యములు కోరువారు మోక్షాపేక్షితులగు వారు నిన్నర్చింతురు. బ్రహ్మ జ్ఞానులకు నీతో పనిలేదన్నాడు.

ఆ మాటలకు పార్వతీదేవికి ఆగ్రహం కలిగింది. దాంతో నేను శక్తి స్వరూపిణిని, సర్వసృష్టికి ఆధారమైన దానినని అలిగి శివుని విడిచివెడలి పోతున్నప్పుడు. ఆదిదంపతులు ఒకరికొకరు దూరమగుట భరించలేని దేవతలు వేడుకొంటున్నప్పటికి అంబిక శాంతించక కైలాసాన్ని విడిచి వెళ్ళిపోయింది. ఆమె బహువిధంబులగు సింహశార్దూల గజమృగాదులచే సేవించబడియు.

నిత్యవైరముడిగియున్న పన్నగ గరుడాది సకల జంతువులచే నిబిడంబగు నానావిధ వృక్షలతాగుల్మాదిభూయిష్టంబయి మునిశ్రేష్ట సేవితంబై సర్వాభీష్టప్రదంబై యొప్పుచున్న బ్రహ్మపుత్రుండగు విశ్వరూపాచార్యుల వారి ఆశ్రమంలోకి వెళ్ళి అక్కడే ఉండిపోయింది. హోమ యోగ్యంబులగు సమిధలు,

దర్భలు, ఫలములు కొరకు అడవికి వెళ్ళివాటిని సమీకరించుకుని శిష్య బృందంతో విశ్వరూపాచార్యులు ఆశ్రమాన్ని చేరి, కోటి సూర్య ప్రభతో వెలుగొందు ఆశ్రమమందలి జగన్మాతను గాంచి, అధితిపూజలుగావించి, సేవించి ఆమె ఆగమకారణం గ్రహించి, మాతా నీమనోవేదన అర్ధమయింది, పరమేశ్వరుతో బాటు నీవును పూజలందుకొను వ్రత విధానమునెరింగింతును, ఆచరించి నీ కోర్కెనెరవేర్చుకొమ్మని, పరమేశ్వరుని ప్రార్ధించి వ్రత విధానాన్ని తెలుపసాగాడు.

కార్తీక మాసములో సోమవారమందుగానీ, శుద్ధ ఏకాదశియందు గానీ, పూర్ణిమ యందు గానీ, అమావాస్య యందుగానీ, ఈవ్రతమాచరించ వచ్చును. ఉషఃకాలమందు భగవన్నామముతో మేల్కాంచి, నిత్యానుష్టానము నెరవేర్చు కొని, వ్రత దీక్షాపరులైసాయం కాలము వరకు ఉపవాసమొనర్చి, గృహమందు వేదికవేసి గోమయముతో అలికి ముగ్గులు పెట్టి, అందు ధాన్యము నుంచి, పంచపల్లవములు గల కేదారేశ్వర పూర్ణకలశము నుంచి, షోడశోప చారములతో పూజించి ప్రార్ధించిన, పరమేశ్వరుడు నీ కోర్కెనెరవేర్చ గలడని చెప్పగా, అంత నా పార్వతీ దేవియధోక్తముగా కేదారక్షేత్రమున వ్రతమాచరించు చుండెను. ఆ వ్రత విధానమునకు సంతసించిన పరమేష్టి ప్రత్యక్షమై ఓ దేవి నీకేమికావలయునో కోరుకొమ్మనెను. అపుడు పార్వతీ పరమేశ్వరుని అర్ధ శరీరముకోరగా, పరమేశ్వరుడు తన అర్ధశరీర మొసంగగా శంకర దేహార్ధమును పొందిన పార్వతీమాత లోకమందలి సకల జనులనుద్ధరింపనెంచి, నాథా! ఈ వ్రతమాచరించువారికి ఇహమందు సర్వసౌఖ్యములనుభవించి అంత్యమున స్వర్గలోక సౌఖ్యములు పొందునట్లు అనుగ్రహించుడని ప్రార్ధింపగా పరమేశ్వరుడు తథాస్తని, అర్ధనారీశ్వరుడై కైలాసమునకు వెళ్ళెను. అది మొదలు సమస్త దేవ ఋష్యాదులు ఆ వ్రతమాచరించుతూ ధన్యులైరి.

**(ద్వితీయాధ్యాయం సమాప్తః ఓం శాంతిః శాంతిః శాంతిః)**

ఓం శ్రీ కేదారీశ్వర ప్రీత్యర్థం నమస్తే నమస్తే నమః

31వ పేజీలోని నివేదనమంత్రం చెప్పి (టెంకాయ కొట్టి హారతివెలిగించి



గంట వాయిస్తూ) కర్పూరనీరాజనం సమర్పయామి ఓంశాంతిఃశాంతిః శాంతిః

## తృతీయాధ్యయ ప్రారంభః

శివభక్తిపరుడైన చిత్రాంగదుడు నందికేశ్వరుని వలన వ్రత విధానము నెరింగి ఉజ్జయినీరాజుకు తెలుపగా ఆరాజుతానా వ్రతమాచరించుతూ పట్టవాసులకు తెలియపరచెనని విశ్వరూపాచార్యుల వారు ఋష్య బృందమునకు తెలుపగా వారు ఆనందముతో మహాత్మా ఈ వ్రతమును చేసి తరించిన వారిని తెలుపమని ప్రార్ధించగా వారి భక్తి ప్రపత్తులకు మిగుల ఆనందించి యిట్లు చెప్పనారంభించెను.

కొంతకాలమునుండి మహారాజు వ్రతము చేయుచుండగా ఆ పట్టణ మందలి వైశ్య కన్యలగు పుణ్యవతియు, భాగ్యవతియను సోదరీలు వ్రతమును చూచి వ్రతమహాత్యమువిని సంతసించి తీర్ధప్రసాదంబులు గైకొని యింటికి వచ్చి తల్లిదండ్రులకు ప్రసాదమునిచ్చి మేమునూ ఈ వ్రతమాచరింతుమని తండ్రికి చెప్పగా అమ్మాయిలూ నేను మిగులరిక్తుండను. మీకు కావలసిన ద్రవ్యములు యివ్వజాలనని తెలుపగా ఓ తండ్రీ మీ అనుజ్ఞయే చాలును అదియే పరమధనము ఆజ్ఞ నొసంగుడని తల్లిదండ్రుల వద్ద సెలవుదీసుకుని కార్తీక సోమవారమందు ప్రాతఃకాలముననే లేచి వ్రత దీక్షనుగైకొని పట్టణ సమీపమందలి వనమున ప్రవేశించి ఒక వటవృక్షము క్రింద వేదిక వేసి అలంకరించి పూర్ణ కలశము నుంచి, మర్రి ఊడలు తొరములగాను, ఆకులు తమలపాకులుగానూ, కాయలు వక్కలుగా వుంచి, పసుపు వుండలు గంధపు వుండలుగా యిరువది అయిదు చొప్పున ఉంచి వ్రతమాచరించి ప్రార్ధించుచున్న సమయంబున వారు ధరించిన పాతవస్త్రములు పట్టు వస్త్రములుగా, ఊడలు పట్టు తోరములుగా, ఆకులు తమలపాకులుగా, కాయలు వక్కలుగా మారెను. దానికి వారు సంభ్రమాశ్చర్యచకితులై పరమానందముతో

**పరమేశ్వరుని ప్రార్ధించుట:** (మీకు యిష్టమైనవి చెప్పుకోవచ్చును)

**దండకం**

శ్రీ పార్వతీనాథ, రక్షించుమోదేవ గంగాధరా, నాగభూషాంతరోల్లాస కేదార విశ్వేశ - శ్రీశైలమల్లీశ కాశీ పురాధీశ్వరా నీలకంఠేశ్వరా దేవ పంచాననాలోక సంచార ఏకాదశానేత్రయో భక్త మందార కైలాసవాసా, మహేశా - కేదారీశ్వర నమస్తే, నమస్తే, నమస్తే నమః॥

యిందంతయూ పరమేశ్వరుని అనుగ్రహమని వారు సంతసించి తీర్థప్రసాదములు పుచ్చుకొని యింటికి వచ్చి తల్లిదండ్రులకు తీర్థప్రసాదముల నిచ్చిరి. వారును బిడ్డల సత్సం కల్పమునకు సంతసించి ప్రతీసంవత్సరమూ వ్రతమాచరించుతూ క్రమముగా ఐశ్వర్యము పుత్రసంతతి కలిగి సుఖముగా యుండిరి.

**తృతీయాధ్యాయం సమాప్తం ఓం శాంతి శాంతి శ్శాంతిః**

శ్రీకేదారేశ్వర ప్రీత్యర్థం నమస్తే నమస్తే నమః

(27వ పేజీలోని నివేదన చెప్పుకుని గంట వాయిస్తూ కొబ్బరికాయ కొట్టి హారతి వెలిగించి గంట వాయిస్తూ)

కర్పూర నీరాజనం సమర్పయామి ఓం శాంతిః శాంతిః శాంతిః

## చతుర్థాధ్యాయ ప్రారంభం

కొంతకాలమునకు పుణ్యవతి, భాగ్యవతియు యుక్త వయస్సు వచ్చుటచే వారికి వివాహము చేయగోరి ఉజ్జయినీ పట్టణమందలి గొప్ప ధనిక వైశ్యునకు పుణ్యవతిని కళింగ పట్టణమందలి సంపన్న వైశ్య కుమారునకు భాగ్యవతిని యిచ్చి మహావైభముగా వివాహములు జరిపించి అత్త వారిండ్లకు పంపిరి. వారు అత్తవారింట కూడా వ్రతమాచరించుతూ మహాదైశ్వర్య వంతులయిరి. సకలభోగ భాగ్యములనను భవింపుచుండిరి. కొంత కాలమునకు భాగ్యవతి ఐశ్వర్యమదమోహితురాలై నోముతోరములు తీసి జీర్ణించిన చిక్కుడు చెట్టుపై పారవైచి బంగారు, వెండితోరములు చేయించి వ్రత మాచరించెను. దానికి శివునికి ఆగ్రహం కలుగుటచే దొంగలవలనను, అగ్నివలనను, రాజదండనలచే వారి ఐశ్వర్యము క్రమముగా క్షీణించెను. చిక్కుడు చెట్టు చిగురించి విపరీతంగా కాయలుకాయుచూ వాటిలోవారి ఐశ్వర్యమంతా



తరలిపోయెను. వారి ఐశ్వర్యము క్రమముగ క్షీణించెను. వారికి కడు పేదరికము సంభవించెను. అనేక కష్టములు వాటిల్లెను. తినుటకు తిండి కూడా కరువయ్యెను. ఒకనాడు భాగ్యవతి తనకుమారుని చేర బిలిచి పెరటిలోని కాకర కాయలను కోసి అమ్మి, వచ్చిన ధనంతో తినుబండారములు తెమ్మని పంపించగా, బాలుడు ఒక వర్తకుని బ్రతిమాలి, విక్రయించి వచ్చిన డబ్బుతో నూకలు తీసుకొనిరాగా, ఆనాడు గంజి భర్త,తాను, కుమారుడుతాగి, పరమేశ్వరుని భజించుచూ, ఆ రాత్రికి నిద్రించిరి. ఆ కాకర కాయలు కొన్న వ్యాపారి రాత్రి కూర వండుటకు కోయగా, అందులోని గింజలన్నియూ బంగారు గింజలుండుట గాంచి, ఇదేమి చిత్రమని వాటిని భద్రపరచి, మరునాడు ప్రత్యేకముగా వ్యాపారాన్ని వదిలి,ఆ బాలుని కొరకు ఎదురుచూస్తూ, బాలుని చూచి,ఎంతో ఆప్యాయతతో పిలిచి,కూర్చుండమని, నాయనా! మీతండ్రి ఐశ్వర్యముకలిగి, అణకువగా జీవించినాడు. కాలం కలిసిరాక మీకు ఈ దుస్థితి సంభవించినది. మీ పరిస్థితికి నేను చాలా బాధ పడుచున్నాను. మీ కాకర కాయలకు అందరికన్నా అధికధనమిచ్చి నాకు చేతనయినంత సహాయము చేస్తాను. యింకా ఏదైనా కావలసిన అప్పుగా యిస్తాను. నీవు ఇంకెవరివద్దకు వెళ్ళకు. మీకు కావలసిన వస్తువులు తీసుకు వెళ్ళమని బాలుడు అడిగినవాటికన్నా ఎక్కువ సరుకులు ఇచ్చిపంపించి,రోజూ ఈవిధంగా కాకరకాయలు తీసుకుని గొప్ప ధనవంతుడాయెను. కాకరకాయలలోకి బంగారము చెట్టుపైపడిన తోరములద్వారా తరలిపోయెను. కాయలు అయిపోయినతర్వాత, వర్తకుడు సరుకులు ఇచ్చుటలేదు. మరల ఆహారములేక పస్తులుంటూ, కుమారునితో నాయనా నీ పెద తల్లి వద్దకు ఉజ్జయినీ పట్టణమునకు బోయి మనకష్టములు తెలిపి కొంత ధనమడిగి తీసుకురమ్మని చెప్పి చద్దియన్నపు మూట కట్టియిచ్చి పంపెను. ఆ బాలుడు బయలుదేరి వెళ్ళుతూ మార్గ మధ్యంబున చద్దియన్నము భుజించి పెదతల్లియింటికి వెళ్ళి తమకష్టములు చెప్పెను. వారి పరిస్థితికి జాలిపడిన పుణ్యవతి కొంతధనము నిచ్చి పంపగా దారిలో దానిని దొంగలు

అపహరించగా దుఃఖిస్తూ పేదతల్లి వద్దకు వెళ్ళి చెప్పగా జరిగినదానికి చింతించి రెండవ సారిఒకగుమ్మడి కాయ దొలచి అందు ధనము నింపి పాతగుడ్డను చుట్టి పంపించెను. ఆ బాలుడు బయలుదేరి మార్గమధ్యంబున చెరువు గట్టువద్ద గుమ్మడి కాయ మూట నుంచి చద్దియన్నము తినుచుండగా ఒక గ్రద్ధ వచ్చి యా మూటను తన్నుకొనిపోయి అదృశ్యముగా యుండి "ఓ" చినవాడా నీతల్లి ఐశ్వర్యమదముచే కేదారేశ్వరవ్రతము విడిచి తోరములు పారవైచినది. దానిచే మీకీ కష్టములు సంభవించినవని పల్కెను. ఆ బాలుడు పెదతల్లి వద్దకు తిరిగి వెళ్ళి జరిగినదంతయూ చెప్పగా ఆమె విషయము గ్రహించి తాను వ్రతమాచరించి బాలునకు తోరముచేతికి కట్టి మరల కొంత ధనమిచ్చి పంపెను. యింటికి తిరిగిపోవుచుండగా లోగడ పోగొట్టుకున్న ధనము దారిలో లభించినది. యిదియంతయూ భగవన్మాయ యని తలంచుచూ యింటికి వెళ్ళి విషయమంతయూ వివరించగా భాగ్యవతి రోదించుచూ "ఓ మహాదేవా" భక్తవత్సలా దీనజనరక్షకా దయానిధీ నీ వ్రతము ధనమధముచే విడిచి మహా అపరాధము చేసితిని. నా తప్పులన్నియూ మన్నించి మము రక్షించి కాపాడుమని బహు విధముల ప్రార్థించి, కార్తీక మాసమున వ్రతమాచరింతునని ముడుపు కట్టి పరమేశ్వరుని శరణుకోరెను.

## చతుర్ధాధ్యాయం సమాప్తం

ఓం శ్రీ కేదారీశ్వర ప్రీత్యర్ధం నమస్తే నమస్తే నమః

31వ పేజీలోని నివేదనమంత్రం చెప్పి (టెంకాయ కొట్టి హారతివెలిగించి గంట వాయిస్తూ) కర్పూరనీరాజనం సమర్పయామి ఓంశాంతిఃశాంతిః శాంతిః

## పంచమాధ్యాయం ప్రారంభం

కార్తీక మాస సోమవారమున భాగ్యవతి బంధుమిత్రాదులతో కూడి యధావిధిగా కేదార వ్రతమాచరించి భక్తిశ్రద్ధలతో తోరమును ధరించి తీర్థప్రసాదములు స్వీకరించి క్రమముగా భోగభాగ్యములు పొంది సుఖముగా యుండిరి. ఎవరు ఈ వ్రత ప్రభావము తెలుసుకుని ఆచరింతురో, ఎవరీ కథను చదువుదురో, "విందురో", ప్రచారం గావింతురో వారందరూ పార్వతీ పరమేశ్వరుల కృపకు పాత్రులై సత్‌సంతానవంతులై అష్టైశ్వరములు



భోగభాగ్యములతో సుఖముగానుండి అంత్యమున శివసాయుజ్యము పొందుదురని విశ్వరూపాచార్యుల వారు తెలుపగా శిష్య బృందములందరూ వ్రతమాచరించి ప్రచారముగావించి చరితార్థులైరి.

**పంచమాధ్యాయం సమాప్త: ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః**

**కేదారేశ్వర ప్రీత్యర్ధం నమస్తే, నమస్తే, నమః**

(31వ పేజీలోని నివేదన చెప్పి కొబ్బరికాయ కొట్టి, హారతి వెలిగించి కర్పూరం నిరాజనం ఇవ్వాలి. వెనుక 32 పేజీలోని మంత్ర పుష్పంను చెప్పవలెను.)

## మంగళహారతి

మంగళం మంగళం, మహనీయ మూర్తికి బంగారుహారతి వరమూర్తినీకే మంగళం
సద్యోజాతాయ శర్వాయ దివ్యజ్ఞాన ప్రదాయనీకే మంగళం మంగళం
మృత్యుంజయాయసాంబాయ సృష్టి స్థిత్యంకారాయ మంగళం, మంగళం
దిగంబరాయత్ర్యంబకాయ, శాంతాయ త్రిలోకేశాయ మంగళం జయమంగళం
మంగళం మహనీయ మూర్తికి శృంగారమూర్తికి శుభ మంగళం నిత్య జయ మంగళం
నింగీరసాతలమూ నిండిన వానికి నిత్య శుభకరునకు నీరాజనంబిదే. కర్పూర నీరాజనంబిదే.
మంగళం, మంగళం నిత్యజయమంగళం, నిత్యశుభ మంగళం
ఉద్వాసన-యజ్ఞేన యజ్ఞ ...సాధ్యాసంతి దేవాః అను మంత్రముతో ఉద్వాసన చెప్పవలెను.

(36వ పేజీలో గల ఉద్వాసన మంత్రం చెప్పవలెను.)

**శాంతిమంత్రము:**

పూర్ణమదః పూర్ణమిదం. పూర్ణాత్పూర్ణముదచ్యతే
పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే
ఓం శాంతిః శాంతిః శ్శాంతిః॥
**సర్వేజనాః సుఖినోభవంతు లోకాస్సమస్తా సుఖినోభవంతు॥**
ఓం సర్వేషాంస్వస్తిర్భవతు। ఓం సర్వేషాం శాంతిర్భవతు
ఓం సర్వేషా పూర్ణంభవతు ఓం శాంతిః శ్శాంతిః శ్శాంతిః॥








గ్రంధకర్త పెద్దకుమారుడు చి॥ శ్రీనివాస్, కోడలు చి॥ల॥సౌ॥సరోజిని
పెద్దమనుమరాలు శ్రీదేవిప్రియ 2వ మనుమరాలు శశి ప్రియ



ధర్మకర్త 2వ కుమారుడు చి॥ శివప్రసాద్, కోడలు చి॥ల॥సౌ॥ గాయత్రీదేవి



స్వామీజీ 72వ జన్మదిన సందర్భంలో పెద్దకుమారుని కుటుంబంతో
బ్ర॥ సుగంధం సాయిబాబాచార్య స్వామీజీ దపంతులు